# అంకితము

తులసి తోటయే నా యింట కలదు కాన,
పెంచ యోగ్యత కలదంచు నెంచెనేమొ
నాకు నారాయణానంద నాథు డొసగె
లలిత సుందర సుమబాల లతిక నొకటి



మరకయే లేని పదివేల మణుల కురిసి
లతకు కుంకుమ పూల విలాస మలది
నవ్వులను రాల్చు ఘమము నానందపరచు
'మ్రోయు తుమ్మెద' కిది నా ఉపాయనమ్ము.

# భూమిక

వేయి నదుల వెలుగు నుండి వెలువడినది వెలుగు నగల హంస. నదుల వెలుగును దర్శించిన కవి, నగల హంసను దర్శించుట వింత కాదు. ఆ నగలు వెలుగు నగలు అగుట కూడా వింత కాదు. కాని, దేవి 'కన్నులందు మెరసినంతనే, వెలుగు నగల హంస మురిసి తానై ముందు కెగిరి వచ్చుట' వింతయే.

మొన్నటి వరకు భూమిలో నున్న బీజ
ము నయి, దేవి వర్షింప మొల్కానయి, చిగురు
లను తొడిగి తొడిగి ఒక చెట్టునయినాను
వేల పరిమళమ్ముల మూట విప్పినాను.

మొన్నటి వరకు డాక్టర్ భూమయ్య కవితాక్షేత్రమున భూమిలో నున్న బీజమే. నిన్నటి నుండి వేయి నదుల వెలుగు రూపమున, దేవి అనుగ్రహము "వర్షించి, మొలకెత్తి, చిగురు పట్టి చెట్టయిన" వ్యక్తి భూమకవి. ఇప్పుడు కుసుమించి వెలుగు నగల హంస రూపమున "వేల పరిమళమ్ముల మూట విప్పి" న మూకకవి. ఆ దేవి ఎవరు?

బ్రహ్మ లేడు, విష్ణువు లేడు, పరమశివుడు
లేడు. వారి లోకములేవి లేవు దేవి !
అందరికి ముందు నీ వుండి, ఆత్మదలచి
సృష్టిజేసితి లోకాల నిన్ని మాకు.

బ్రహ్మ విష్ణు మహేశ్వరుల కంటె, సత్య వైకుంఠ కైలాసలోకముల కంటె ముందున్న దేవి "అమ్మల గన్న యమ్మ ముగురమ్మల మూలపుటమ్మ." అనాడు బమ్మెర

పోతన ఇష్టదేవత. ఈనాడు అనుమాండ్ల భూమయ్య అభిమాన దేవత. ఇద్దరును ఏకశిలా నగరవాసులే. ఏకశిల శిల్పములకు శిలాయంత్రములకు ప్రసిద్ధమే. అంతే కాదు సాధనమే. .

వేయి నదుల వెలుగు వలెనే. వెలుగు నగల హంస కూడ జీవకళ ఉట్టిపడు కవితాశిల్పము. వట్టి స్తోత్రము కాదు. ఆత్మనివేదనము, అధ్యాత్మచింతనము, ఉక్తివైచిత్రి రాశీభూతమైన రసత్రివేణి. సహృదయ హృదయంగమము.

*దేవి ! నేనేదొ చదివితి, తెలిసికొనిన*
*దేమి లే. దితరుల కింత కేమి తెలిసి*
*పదవి నాకిచ్చిరొ యెరుకపడదు, కాని*
*ఎరుక గలవారి నెగురగొట్టించినాను.*

ఏదో చదివి, ఏమీ తెలియక, ఎటులో పదవి సంపాదించి, ఎఱుక గల వారిని ఎగుర గొట్టించు ప్రబుద్ధులు ఎందరో? కృతమెఱుగు సుబుద్ధులు కొందఱే !

*ఎటనొ దొరికిన శ్లోకము నిట్టె పట్టి*
*సాగదీసి తీసి పదారు సభల లోన*
*పాడినదె పాడితిని దేవి ! ప్రజలు నవ్వ*
*విర్రవీగితి నేనె వివేకి నంచు.*

ఎక్కడో దొరికిన శ్లోకమో, ఎప్పుడో వచ్చిన పద్యమో, ఎవ్వరో చెప్పిన విషయమో. పదారు సభలలోనే కాదు, ప్రతి సభలోను పాడిన పాటే పాడి, శ్రోతలు ఎగతాళి చేసినను, తామే వివేకులమని తలంచు పండితమానులు ఎందఱో? పరిజ్ఞానము కల పండితమౌనులు కొందఱే !

*ఎంత మెత్తగా మాట్లాడ నెంచినానొ*
*అంత పరుషమ్ముగా మాటలాడుచుంటి:*
*దేవి ! నా నోటిలో అగ్నిదేవు డిపుడు*
*కాపురము చేయునటువె నా కన్నుగప్పి.*

మృదువుగా మాటాడదలచినను. కఠినముగా మాటలాడుటకు కారణము. తన కన్నుగప్పి. తన నోటిలో అగ్నిదేవుడు కాపురము చేయుట కాఁబోలు అనుటలోని ఉక్తి వైచిత్రి ఉజ్జ్వలము.

ఉక్తి వైచిత్రి వ్యంగ్యోపజీవి.

వేసిన ఎరువె విషమయి వేరు జెరుప
ప్రాణశక్తులే ఉడిగి ఈ పగిది నుంటి;
దేవి ! కోకిల నిటు పంపి దిక్కుచెడిన
నా పయి వసంతమును పాడ నోపగలనె ?

వేసిన ఎరువే విషమై, వేఱు చెఱుప ప్రాణశక్తులే ఉడిగిన, మఱల ప్రాణశక్తులు ఒసగగలవె? అని అడిగిన వాచ్యమగును. కోకిలను పంపి వసంతరాగమును పాడగలవె? అని అడిగిన వ్యంగ్యమగును.

ఈ 'అహ'ము మధ్యలో దేవి ! ఎన్ని వర్ణ
ములు కలవు, మంత్రము లవెన్ని కలవు, శాస్త్ర
జాల మెంత కలదటంచు నేల నడుగ?
కలవు కదె సమస్తమగు లోకములు నిండె.

అకారాది క్షకార పర్యంతము అక్ష మాల. అక్షరమాల కూడ. అక్షమాల జపమునకు సాధనము. అక్షరమాల జ్ఞానమునకు సాధనము. ఇది సర్వవిదితము. కాని క్షకారము వర్ణము కాదు. సంయుక్తాక్షరము. అకారాది హకారపర్యంతమే వర్ణ సమామ్నాయము. అది ''అహ''ము. అహంకారము కూడ అహము. అకారాది హకార పర్యంత వర్ణ సమామ్నాయము నందు వర్ణములు కలవు. మంత్రములు కలవు. శాస్త్రములు కలవు. సమస్త లోకములు కలవు. అవి అహంకారమునందును కలవు. అహంకారములోని వర్ణములు కలుషితములు. మంత్రములు దూషితములు. శాస్త్రములు వినాశకరములు. సమస్త లోకములు సందేహాస్పదములు. ''అహ''ము ప్రౌఢపదప్రయోగము. శబ్దశక్తి మూలక ధ్వన్యుపస్కారకము.

ఎంత కాల మా కఠినమౌ హిమశిఖరము
ఉండె మీ పట్టు తాండవ మాడ నేల?
మెత్తని కమలదళముల నొత్తుగా ప
రచితి దేవి! నా తలపైకి రారె మీరు.

ఇది పండితారాధ్యచరిత్రములోని పర్వతుని భక్తిని మించినది. అతడు శివుని ఔదల ధరించుటకు తపస్సు చేసి అయినది పర్వతము. కైలాస పర్వతమునందు కఠిన హిమశిఖరము తాండవరంగస్థలమైన, శ్రీపర్వతమునందు కఠిన తప్తశిఖరము తాండవ రంగస్థలమగును. మెత్తని కమలదళములు ఒత్తుగా పఱిచిన శిరస్సు మీది శిఖరము మృదులమౌ పూలపఱుపు. ఇది పరమభక్తికి పరాకాష్ఠదశ.

న న్నెవరి కిచ్చెద వటంచు నాన్న నడిగి
అడిగి విసిగింప కోపించి యముని కిత్తు
నని పలికినంత, నేనట్లె యముని జేరి
మృత్యువు నెరిగి నా తండ్రి కెరగినాను.

ఇది కఠోపనిషత్తులోని నాసికేతుని తత్త్వమును నించినది. ''ఉపషద్దివ్య సుమములో నున్న'' దేవి ''పాదమకరంద బిందువు గ్రో''లిన ఫలము.

ఈ కవి భక్తి ముగ్ధభక్తి కాదు. మధురభక్తి కాదు. సేవాభక్తి మాత్రమును కాదు. మఱి? నిత్యస్నేహభక్తి. నవవిధ భక్తులలోని సఖ్యభక్తి.

వారు నా కర్మ కిట నన్ను చేరవేసి
వారి దారిలో వారేగినారు; వెలుగు
ననుకొనిన దీపమిది భగ్గుమనె, ని దేమి ?
అమ్మ! మనది నిత్యస్నేహ మాత్మ వలెనె.

ఆత్మ నిత్యము. స్నేహము నిత్యము. భగ్గుమనిన దీపము నిత్యస్నేహము వలన మఱల భాసించును. నిత్యస్నేహము దేవిని నిలదీసి ప్రశ్నించును.

అన్న మున్ననే పుట్టుక. అన్న మున్న
నే బ్రతుకుట, అన్నమునకె ఈ బ్రతుకుట:
అన్నమే లేదొ ప్రాణుల కంత మపుడె
అన్నపూర్ణవు కదవె. మా కన్న మిడవె.

విరిసి దేవి! నీ గుడి కింత వెల్లనౌదు
నని కదే రాయినై పుట్టి అగ్నియందు
జేరి నే కాలి కాలి చల్లారినాను
నీవు కుగియ వింత కొక కన్నీటి బొట్టు.

ఇవి రసార్ద్రములైన వెలుగు నగల హంస లోని పద్యములకు శృంగ గ్రాహికలు. ''దేవి అందియల రవళిని అక్షరములు చేరి పద్యము''లయినవి. తెనుగు దనము తేజరిల్లినది.

ఇది సామాజిక స్పృహ కాలము. ఇందు ఆధ్యాత్మిక స్పృహ కలదు. ఏ స్పృహ అయినను, స్ఫురణీయము, రమణీయము అయిన, సహృదయులకు ఉపాదేయమే.

విశాఖపట్టణం

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి

# చంక్రమణం

అనుమాండ్ల భూమయ్యగారు వేయి నదుల వెలుగుతో కవితారంగస్థలం మీద ఆరంగేట్రం చేసి. నేను 'బహుపరాక్' వ్రాసి ఇంకా ఏడాది గడిచినట్టు లేదు. ద్వితీయ విఘ్నం కాకుండా అప్పుడే ఈ వెలుగు నగల హంసతో ముందుకు వచ్చారు.

మొదట్లో నేనూ అనుమానించాను. కొత్త పిచ్చి కాదుగదా అని సంశయించాను. ఆ దృష్టితోనే అక్షరాక్షరమూ విన్నాను, కన్నాను, కాదని తేల్చుకున్నాను. ఇందులోనూ అదే కవితావస్తువు. అమ్మవారి పూనకంనుంచి భూమయ్యగారి అంతశ్చేతన ఇంకా విడివడలేదు. వేయి నదుల వెలుగుకి ఇది కొనసాగింపు. పరిశిష్టంగా వెలువడుతున్న రెండవ భాగం వంటిది. అందుకే ముక్తపదగ్రస్తంగా దీని పేరు వెలుగు నగల హంస.

అధ్యాత్మసీమలో చాలావాటికి హంస ఒక ప్రతీక. ఇక్కడేమో ఇది కవిరాజ హంస. మౌనముద్రతో మానస సరోవరంలో విహరిస్తున్నప్పుడు దీని కన్నులలో దేవి మెరిసింది. మురిసి తానై ముందుకు ఎగిరి వచ్చింది ఈ వెలుగు నగల హంస. ఇది సాలంకృతం. అయితే ఈ నగలు సామాన్యమైనవి కావు. యావత్ప్రపంచానికే ఏనాటికైనా భారతదేశం తనదిగా చూపించుకోగలిగిన విలువైన వెలుగు నగలు. వీటి వెలుగులు పరులను ప్రలోభ పెట్టేవి కావు. జీవనశైలిని సంస్కరించి చీకటులను తొలగించి మనశ్శాంతిని కలిగించేవి. దేవలోకమే శిరస్సుగా విశ్వహృదయంతో బాధలను ఆలించే జగజ్జనని పాదాల చెంత శోకించి, నుదుటు సోకించిన కవి ఫాలభాగంమీద పుష్పించిన కుంకుమ పూల చెట్లు ఈ వెలుగు నగలు. అందుకే ఒకటి నా కుడి బుజంగా, మరొకటి నా ఎడమ బుజంగా, వేరొకటి నా పుచ్ఛభాగంగా ఇంకొకటి నా సమున్నత శిరస్సుగా ''వేదముల రూపమే నేను వెలుగు నీవు'' అనీ ''నన్ను నగలుగా చేసికొన్నాను నేను (39)'' అనీ సగర్వంగా ప్రకటించుకొంది ఈ హంస.

వైదిక సాహిత్యానికి ప్రత్యేకమైన అభివ్యక్తి మార్గం ఒకటి ఉంది. అటువైపు పయనించిన తెలుగు కవులు ఒకరిద్దరికన్నా లేరు. ఈ తరం ప్రతినిధిగా ఈ కవి ఆ మార్గాన్ని అందుకున్నాడు. అభిరుచీ అంతస్సంస్కారాలతో పాటు ఆధునికమైన అభివ్యక్తికి ఆ మార్గం అత్యంత సన్నిహితం కావడంకూడా దీనికి ఒక కారణం కావచ్చు. ఒక పదము తల్లి, తండ్రి వేరొక్క పదము, వారి అక్షరమౌ ప్రేమ ఫలితమేమొ నేను సంధి రూపముగ జన్మించినాను: దేవి !.... (2) ఈ అభివ్యక్తి కచ్చితంగా ఉపనిషన్మార్గం.

ఛాందోగ్యాది ఉపనిషత్తుల్లో వేదమంత్రాలలో అక్కడక్కడా తళత్తళలాడుతూ పాఠకుల్ని నిబిడాశ్చర్యనిమగ్నుల్ని చేసే ఆ మెరుపుల్ని గుప్పిట పట్టుకున్నారు భూమయ్యగారు.

*దేవి ! ఈ విశ్వమున నెయ్యది కలదొ....(16)*

*ఎంత మెత్తగా మాట్లాడనెంచినానొ.... (18)*

*తలను చూడగా నుదయపు వెలుగు లూరు.... (20)*

*నన్నెవరి కిచ్చెదవటంచు నాన్న నడిగి.... (22)*

*ఇన్ని విత్తనా లేటేట.... (31)*

*ఇన్ని వేల లక్షల ఆకులున్న చెట్టు.... (31)*

*అచట ఆ ఇంటిలోనున్న అగ్నిదెచ్చి.... (48)*

*ఎట్టి రూప మగుపడనిది.... (49)*

*అగ్నిరూపమ్ముతో దేవి ! అహరహమ్ము.... (62)*

*శిరసుపైగల పూవుతో చెట్టొకండు.... (68)*

ఈ పద్యాలూ:

*నన్ను దేవి మహాగ్నిసంపన్నుజేసె (66), రక్తమున పూచె పాటల ప్రణవరుచులు (67). మహాగ్నిలోన స్నానమాడించె నను దేవి చక్కదిద్ద (70). పూచె కన్నుగా ఒక అగ్నిపూవు దేవి ! (71), అగ్ని త్రాగి త్రాగి అగ్నినైతి (71)*

ఈ పాదాలూ పై మాటకు నిదర్శనాలు.

ఉపనిషద్దివ్య సుమములో నున్న నీ పద మకరంద బిందువు గ్రోలదలచి

*దేవి ! మనసుపడి వచ్చితి. నొక సాధనము లేమ (57)*, అని కవి నిజాయితీతో చెప్పు కున్నాడు. *తీక్ష్ణముఖి రసలుబ్ధయౌ తేనెటగ పూల యెదలోని తేనెలు గ్రోలు టెరిగి* తానిలా మనసుపడ్డానని కారణం కూడా చెప్పాడు. నేల లేనిదే నింగి లేదంటే ఇదే. అయితే నేలమీదనే పొర్లాడుతున్నాడా లేక నింగివైపు దృష్టి సారిస్తున్నాడా అనేదాన్ని బట్టి కవిలో ఎదుగుదలను కొలుస్తారు తలపండిన విమర్శకులు. వచనకవితల్లోకూడా బిబ్లికల్ గానో ఖురానికల్ గానో ఏదైనా ఒక అభివ్యక్తి ఎక్కడైనా కనిపిస్తే చాలు వీరు మురిసిపోయి తెగ మెచ్చేసుకుంటారు. మరి ఈ పద్యాలు చదివితే ఎంతగా ఆనందిస్తారో !

*వేయి నదుల వెలుగు*లో ప్రధానంగా స్తోత్ర సాహిత్యానికి ఆకృష్టుడైన కవి కనిపిస్తాడు. *వెలుగు నగల హంస*లో వైదిక సాహిత్యానికి ఆకర్షితుడైన కవి కనపడతాడు. ఇది కచ్చితమైన ఎదుగుదల. అయితే భారతీయమైనది ఏదయినా సరే పనికిమాలినదె అని బద్ధకంకణులై బురదజల్లే సంస్కృతి విరోధులు మాత్రం దీన్ని జీర్ణించుకోలేరు. అస్తు నామ !

''నీవు వ్రాస్తున్నది కవిత్వంరా బాబూ !'' అని ఎవరో ఒకరు వెన్ను తట్టాలి. రాతి పొరను పగులగొట్టాలి. అప్పుడుగానీ జల ఎగజిమ్మదు. కవి బయట పడడు. ఆ పని చేసిన వారు మా గురుదేవులు అనంతప్రేమమూర్తి శ్రీశ్రీశ్రీ లక్ష్మణయతీంద్రులు. అప్పటినుంచీ సోదరుడు భూమయ్యగారి *గడ్డిపోచల గుడిసె రతనాలు పుక్కిలించె (43)*. *వేయి నదుల వెలుగు* విరియబూసింది. అయినా బెరుకు పూర్తిగా వదలలేదు. ఆపరితోషా ద్విదుషామ్.... అనే మాట అలా ఉండగా, వస్తువూ రూపమూ పాతకాలం నాటివి కదా అనే బెంగ ఒకటి. *పాతకాలము నాటి వీ బట్ట లెవ్వ రేమనెదరొ ఈ బడిపిల్ల లింద రనుచు బెరుకుతో నేగ* అన్ని వైపులనుంచీ నాటి సాహితీపరులంతా *లలితసుందరసుమ సదృశములివి (43)* అంటూ ఆ వెలుగుల్ని ప్రశంసించారు.

*పద్యమే మావియై దేవి ! బ్రతుకు కనగ,*
*కోకిలలు వచ్చి పాటల గ్రుమ్మరించె.*
*చిలుక లిటె వచ్చి ఫలముల పలుకరించె,*
*పథికు డొక రసానందుడై పరిమళించె (44).*

దీనితో ధైర్యం పుంజుకొని కవిని అనే ఆత్మప్రత్యయంతో ఈ *వెలుగు నగల హంస*ను వెలువరిస్తున్నారు.

లలితాసహస్రనామాలలో కవితా పరిమళాలను విరజిమ్మేవి చాలా ఉన్నాయి. వాటిలో కదంబ కుసుమప్రియా, చాంపేయకుసుమప్రియా, పాటలీకుసుమప్రియా, మందారకుసుమప్రియా, చైతన్యకుసుమప్రియా – అనే అయిదింటినీ స్వీకరించారు భూమయ్యగారు. సృష్టి నిర్మాణానికే అయిదంకెకూ, అమ్మవారి ఉపాసనకూ అయిదంకెకూ ఒక నిగూఢమైన సంబంధం ఉంది. కాగా–

*చిగురులను తొడిగి తొడిగి ఒక చెట్టునయినాను, వేల పరిమళమ్ముల మూట విప్పినాను (2)* అనేది కదంబ కుసుమానికి కీలకం.

*ఈ పరాపర విద్యల కేమిగాని, మూలమే లేని ఏ వాద మేల గాని, ఏది నీపాద మింత నాకిమ్ముదేవి! ఏది కనిపించునో చూచి యెరుక పడుదు (26)* అనేది చాంపేయ కుసుమ పరిమళం.

*ఇంతగా పెత్తనము చూపె దేల దేవి! యెంత మెత్తని వానికే నెముకలుండు (27). నీ మొగము చూచి దేవి! మరియు వా రెవ్వ రీ దిసల లేరు. నీ వెవరి తల పాల్వోసినావు కనుక (27)* అనే ధోరణి పాటలీ కుసుమం లోని పాటలత్వం.

అటూ ఇటూ నిలిపిన అక్షరస్తంభాలకు కట్టిన *అక్షరపు టూయెల పయి నా అలికమందు నూగె శివుని అంకమ్మునం దొదిగి దేవి (45)* అనేది పాటలీ కుసుమం నుంచి మందార కుసుమానికి ప్రాకిన కుండలిని ఎర్రదనం.

ఎంత కాలమూ కఠిన హిమ శిఖరాల మీదనేనా మీ తాండవం. *మెత్తని కమల దళముల నొత్తుగా పరచితి దేవి! నా తలపైకి రారె మీరు (63)* అనేది చైతన్య కుసుమంలోని ఆత్మచైతన్యం.

దేవీ ఉపాసనను గుహ్యావిద్య అంటారు తాంత్రికులు. ఆరాధనలో లాగానే కావ్య నిర్మాణంలోనూ కవితారచనలోనూ ఒక నిగూఢమైన వ్యూహం ఉంటుంది. దాన్ని అందుకో గలిగితే మరింతగా ఆనందనిష్యంది అవుతుంది.

భక్తి కవిత్వంలోనూ దేశభక్తి కవిత్వంలోనూ ఇవ్వేళ కొత్తదనం వెలయించడం చాలా కష్టం. ఆత్మనివేదనమే అయినా అయిదువేల సంవత్సరాలుగా సాగుతున్నప్పుడు కొత్తదనం ఎలా సమకూరుతుంది? నిజమే కానీ లౌకిక జగత్తుమీద కన్నుపెడితే అలౌకిక జగత్తుతో దాన్ని ముడిపెడితే కాలాన్నిబట్టీ తరాన్నిబట్టీ అనుభవంలో తేడాలు ఉంటాయి కనక కొత్తదనం ఉట్టిపడుతుంది.

శ్వాస అనే ఒక లతకు మనసు అనే కలశాన్ని కట్టి చంద్రుడు అనే బావిలోకి (తాంత్రికాభివ్యక్తి) దింపుతున్నాను- ఒకంత సుధ నందు నింపె వటువె? (44) అనే అభ్యర్థనలో సాధకుని అనుభవం లౌకికాంశతో కలిసి కొత్తదనాల్ని గుబాళిస్తోంది. ఇది కవికి మాత్రమే చేతనైన రసయోగం. పారాణి కలపడం.

ఈ విద్య ఈ కావ్యమంతటా కనబడుతున్నా

*ఎవరి నెక్కుడ నేరీతి.... (9),*

*చేను నీదె కాదన దేవి.... (9).*

*ఇన్ని గాయముల నెడద నెందుకొరకె.... (30).*

*ఏమి కోరి దేవి! ఇంత చేసితివి.... (32).*

*తెలిసినదె వేద మనుకొన్న దినములందు.... (33),*

*దేవి! నను పైకి లాగుచున్నావు కాని,*
*ఇంత ప్రేమించి నను క్రింది కీడ్చు ప్రకృతి,*
*బలములను తేల్చుకొన మీరు తలచినారొ.*
*వాడుకొందురె నన్నొక్క త్రాడు జేసి. (35),*

*నేల నతడు దున్నిన రతనాలు పండె.... (35),*

*నాలు గడుగులు నీవైపు నడువలేదు.... (37),*

*పరిమళములె జాల్వారు ఈ పాలకొలను*
*నందు దేవి! ఈ రక్తపు టల లివేమి?*
*హంసి కాలికి మెత్తనైనట్టి చిన్ని*
*కత్తి కనిపించు, నిన్నటి గజ్జె లేదు. (39),*

*....మధ్య తరగతి నా భక్తి మనసు పడుదె ?(40),*

*పాక చెక్కలు త్రొక్కుచు.... (41),*

*పాద మనెడి నీ సొగసైన బడిని జేర,*
*హంసనై వచ్చితిని దేవి! అనుమతింతె ?.... (46),*
*శ్వాస ఊయలపై తేలివచ్చుచుండె*
*మనసు నినుజేర దేవి.! దర్శనము నిమ్ము.... (47).*

పిలిసి దేవి! నీ గుడి కంత వెళ్లి నాడు
నని కదే రాయినై పుట్టి అగ్నియందు
జేరి నే కాలి కాలి చల్లారినాను
నీవు కురియు వింత కౌక కన్నీటి బొట్టు (51),

ఎంతసేపటి కతడు నన్నెంత చేసె.... (59)

ఇత్యాది పద్యాల్లో మేలిమి బంగారమై మెరిసిపోతోంది.

ఇలా నేలమీద నిటారుగా నిలిచే పద్యాలు అధిక సంఖ్యలోనే ఉన్నాయి. సింహభాగమే. వీటితోపాటు నేలమీదనే పొర్లాడుతున్నవీ బొరియలు చేసుకుని దూరి పోతున్నవీ కొన్నయినా లేకపోలేదు. దేవి ! నేనేదొ చదివితి.... (7). ఎటనొ దొరికిన శ్లోకము.... (7), నేనె సలహా నొసంగితి.... (8) అనే వరస మూడు పద్యాలూ, తొమ్మిదో పుటనుంచి పధ్నాలుగో పుటలోగా ఎదురయ్యే ఏడెనిమిది పంచపాదులూ వగైరా నేలమీద పొర్లాడుతున్న పద్యాలు. ఉక్తిలో ఒకపాటి గడుసుదనమూ కాసింత గుట్టూమట్టూ వీటిలో కనపడుతోంది కనక పొర్లాడుతున్నవి అనడం. అదీ లేకుండా బొరియల్లో దూరిపోయే వాటిని వెదికి పట్టుకునే శ్రమ నేను పడదలచుకోలేదు. కానీ–

గురుదేవులే బతికి ఉంటే ఈ రెండు కావ్యాలూ చదివి ఏమనేవారో చెప్పనా? వేయి నదుల వెలుగు మా భూమయ్య, వెలుగు నగల హంస మా భూమయ్య అంటూ హాయిగా నవ్వుతూ ఓహ్ ఓహ్ అని కళ్ళు తుడుచుకుంటూ గాట్టిగా కౌగిలించుకునేవారు. (వీపు చిట్లగొట్టేవారు). ఈసారి కలిసినప్పుడు ఆ పని నేను చేస్తాను లేవయ్యా భూమయ్యా! (శ్రీ సీతారాం చెయ్యకపోతే).

చివరగా పద్య నిర్మాణశిల్పం గురించి ఒక్కమాట – తేటగీతులకూ ఆట వెలదులకూ ఒకరీతి గతిమాధుర్యాన్ని అలవరిచారు మన పెద్దలు. భూమయ్యగారేమో పాదం నుంచి ప్రాకడం, పదమధ్యంలో యతి వెయ్యడం, రెండు పదాల కలయికతో ప్రాసయతి కూర్చడం– ఇలాంటి చమక్కులు చేసారు. గణవిభజన జాగ్రత్తగా చూసుకుంటే తప్ప యతినీ ప్రాసయతినీ గుర్తించడం కష్టమయ్యే పద్ధతిని ప్రవేశపెట్టారు. దీనివల్ల మనం అలవాటుపడ్డ గతి మాధుర్యం దెబ్బతిని వచన గంధులు అవతరించాయి. ఈ అవస్థ

వేయి నదుల వెలుగులో ఉన్నంతగా ఇందులో లేకపోవటం అదృష్టం. ఇటుపైని వ్రాసే వాటిలో అస్సలుండవని భరోసా ఇస్తోంది ఈ ఎదుగుదల.

తెలుకుటకు కాల మనుకూల మౌనొ కాదొ
అనునదే లేక అలికితి నక్షరముల
కాలమును నీవె మూలమౌ నేల వీవె
మొలక బల మీవె దేవి! ఈ మొలక వీవె.

భూమయ్యగారూ! ఇదే ఆత్మవిశ్వాసంతో కొనసాగండి. శంకలూ డొంకలూ ఏమీ వద్దు. కాలం మనకెప్పుడూ అనుకూలమే. ఆ మాటకు వస్తే మనకే అనుకూలం. ప్రతిభాపాండిత్యాలు ఒకరి సొత్తుకావు. ఒకరు వద్దంటే మాయమైపోవు. జీవం ఉన్న రచన ఏ కాలంలోనైనా బ్రతికి తీరుతుంది. శాపనార్థాలు చంపలేవు, భజన సంఘాలు బ్రతికింపలేవు.

నిర్భయంగా రచన సాగించండి. మెట్టు మెట్టుగా కవిపీఠం అధిరోహించండి.

సెలవు.

తేది : 15-7-1995
బొమ్మూరు - 533 124

మీ
రామబ్రహ్మం

# కావ్యం గురించి.....

వెలుగు నగల హంస నా రెండవ కావ్యం. ఇందులో కదంబ కుసుమం మొదలైన అయిదు విభాగాలున్నాయి.

విద్య అనే ఒక శక్తి, మనిషిని మట్టి నుండి లేపి, క్రమక్రమంగా ఉన్నత శిఖరాలకు చేర్చటం ఈ కావ్యంలో వర్ణింపబడింది.

పుట్టిన మనిషి బాల్యంలో మట్టితో ఆడుకొంటు, మట్టి రుచి మరగి, మట్టి ప్రాణంగా, లోకంగా, నాగటి చాలు లోని ఒక బీజంవలె కాలం గడుపుతుంటాడు. తగిన వయసు రాగానే తల్లిదండ్రుల ప్రోద్బలంతో బడిలో చేరుతాడు. బడిలో నేర్చుకొన్న విద్య అతనిలో ఆలోచనలను కలిగిస్తుంది. ఆలోచనామృతం అతనికి ఒక వెలుగును ప్రసాదిస్తుంది. చివరి కతడొక జ్ఞాన తేజోమూర్తి అవుతాడు.

ఈ క్రమ పరిణామమే ఈ అయిదు విభాగాల్లో తెలుపబడింది.

నేల నంటిపెట్టుకొన్న భావాలు *కదంబ కుసుమం*లో ఉన్నాయి. ఈ మొదటి విభాగం మనిషి బాల్యానికి చిహ్నం. ఉపనిషత్సుమ పరిమళాలు *చాంపేయ కుసుమం*లో ఉన్నాయి. ఇది విద్యకు చిహ్నం. *పాటలీ కుసుమం*లో కొన్ని భావసుమ పరిమళాలున్నాయి. విద్య కలిగించే ఆలోచనల కిది సూచన. నిరంతర విద్యాసాధన వల్ల కలిగే కొన్ని దర్శనాలు – భావ చిత్రాలు *మందార కుసుమం*లో ఉన్నాయి. విద్యా సముపార్జన వల్ల ఏవో వెలుగు రేఖ లతని లోనికి అవతరిస్తున్నాయనడాని కిది సూచన. సందేహాలకు తావులేని ఒక సుస్థిర భావ లక్షణం *చైతన్య కుసుమం*లో కనిపిస్తుంది. విద్య వల్ల మనిషి చైతన్యకుసుమమై పరిమళిస్తున్నాడనడానికి ఈ అయిదవ విభాగం సూచన.

ఆయా విభాగాల ప్రారంభంలోని – ''కదలక మెదలక...'' (కదంబ– 2); ''దేవి! చెలగి నీవు...'' (చాంపేయ– 1); ''కోరి పద్మాసనము...'' (పాటలీ– 1); ''అక్షర

స్తంభములు..." (మందార-1): "ఎంతకాల మా..." (చైతన్య-1) అనే పద్యాల్లో సూచింపబడిన మూలాధార, మణిపూర, అనాహత, ఆజ్ఞా, సహస్రార కమలాల్లో కుండలినీ శక్తి ద్వారా కూడ ఒక క్రమ పరిణామం సూచింపబడింది.

వెరసి ఈ కావ్యం ఆర్షజ్ఞాన భాండాగారమైన ఉపనిషత్తుల్లోని వెలుగు నగల హంస విన్యాసం. ఈ హంస భారతీయమైన ఆత్మకు ప్రతీక. హంస రూపంలో దర్శనమైన భారతీయాత్మను చిత్రించటానికి చేసిన ప్రయత్నమే ఈ వెలుగు నగల హంస.

గురువర్యులు శ్రీ నారాయణానంద నాథుల వారికి డెబ్బై ఏడవ జన్మదినాన్ని (28-7-1918) పురస్కరించుకొని ఈ కావ్యాన్ని అంకితమిస్తున్నాను: ప్రేమతో వారు స్వీకరించినందుకు నాకు సంతోషంగా ఉంది.

నా కోరికను మన్నించి, కావ్యానికి 'భూమిక' వ్రాసిన ఆచార్య కోర్లపాటి శ్రీరామమూర్తి గారికి, ఈ పద్యాలను మొట్టమొదటిసారిగా శ్రీ ఎర్రాప్రగడ రామకృష్ణ గారింట్లో, జూన్ 4, 95 నాడు విని ప్రచురణకు ప్రోత్సహించి, కావ్యానికి 'చంక్రమణం' వ్రాసిన మిత్రులు ఆచార్య బేతవోలు రామబ్రహ్మం గారికి, ఇందలి కొన్ని పద్యాలను ప్రచురించిన ఆంధ్రప్రభ వారపత్రిక సంపాదకులకు కృతజ్ఞుడను.

ప్రచురణ విషయంగా ఆర్థిక పరమైన ఇబ్బందులు కలుగకుండ చూసిన మిత్రులు శ్రీ డి. బాల్ రెడ్డి గారు –

అశోకకృష్ణ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ అధినేత మిత్రులు శ్రీ నాగుల యుగంధర్ గారు పుస్తకంతో పాటు కవరు పేజీని అందంగా అచ్చువేసినారు. వీరికి నా కృతజ్ఞతలు.

హిరణ్మయి
5-11-581
విద్యారణ్యపురి
హన్మకొండ-506 009

అనుమాండ్ల భూమయ్య
28-7-1995



డా. అనుమాండ్ల భూమయ్య

ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.

రీడర్, తెలుగు విభాగం

కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్

తల్లి : శాంతమ్మ; తండ్రి : లస్మయ్య

పుట్టిన తేది: 19-9-1951

పుట్టిన గ్రామం : వెదురుగట్ట, కరీంనగర్ జిల్లా

ప్రచురింపబడిన గ్రంథాలు:

1. నాయని సుబ్బారావు కృతులు - పరిశీలన 1981
2. కొరవి గోపరాజు - సాహిత్య విశ్లేషణ 1983
3. వేయి పడగలు - ఆధునిక ఇతిహాసం 1984
4. వ్యాస భారతి 1988
5. ఆద్యుడు కట్టమంచి 1992
6. మాలపల్లి - అభ్యుదయ మహాకావ్యం 1992
7. వేయి నదుల వెలుగు (పద్య కావ్యం) 1994



# కదంబ కుసుమము

మౌన ముద్ర దాల్చి మానస సరసులో
నున్న తనకు నీవె కన్నులందు
మెరసినావొ దేవి ! మురిసి తానై ముందు
కెగిరి వచ్చె వెలుగు నగల హంస.

కదలక మెదలక మరెంత కాల మట్లె
ముడుచుకొని మూల నుందువు ముఖము దాచి
దేవి ! మనసార పిలిచితి రావె లేచి
పైకి రాకుందు వేని ఏ పనులు కావు.

ఒక పదము తల్లి, తండ్రి వే రొక్క పదము,
వారి అక్షరమౌ ప్రేమ ఫలిత మేమొ
నేను సంధి రూపముగ జన్మించినాను,
దేవి ! నీ హాసమును సమృద్ధిగ వహించి.

మొన్నటి వరకు భూమిలో నున్న బీజ
ము నయి, దేవి వర్షింప మొల్కనయి, చిగురు
లను తొడిగి తొడిగి ఒక చెట్టు నయినాను;
వేల పరిమళమ్ముల మూట విప్పినాను.

వివిధ గతుల నే డీ గుండె వీధులందు
దేవి ! నీ అందియలు మ్రోగ తిరుగులేని
ఆ రవళినె కదే చేరి అక్షరములు
పాలు తేనెలుగా కూడి పద్య మగును.

గుడికి వచ్చిన యపు డేను కోరకుండ
ఏమి పూవునే దేవి ! నా కిచ్చినావు
నీ ప్రసాద మనుచు, ఇది నీ హృదయము
పండి రాల్చిన మెత్తని పద్య మేమొ.

దేవి ! ఈ లోకమును గని దేవలోక
మవతరించి నంతనె జన్మమయ్యె నాకు
పాలు తామెయై బ్రతికించె పక్షి గణము
ఆత్మ తానెయై పోషించె ఆశ్రమమ్ము.

ఏదొ సుడిగాలి వచ్చి నప్డెల్ల దుమ్ము
ధూళి బాటసారుల నెల్ల దుఃఖపరచు
చుండెనని, ఎపటి కపుడె ఊడ్చి చల్లి
దేవి ! ఈ భూమి నిటు తీర్చి దిద్దుచుంటి.

భూమి నుండి లేచియె పైకి పోవు చెట్టు:
చెట్టు నుండి నింగి కెగురు చిలుక లేచి:
ప్రకృతి నీవయై నాకిన్ని పాఠములను
నేర్పినను లేవలే నేల ? నేను దేవి !

ఏమి లేని నాడెంతయో తృప్తి నాకు
అన్ని ఉండి ఏలకొ దుఃఖ మధిక మిపుడు,
ఇంతలో నసూయ ఒకటి ఎట్లొ దేవి !
పుట్టె – ఇంటి గోడకు మర్రి మొలక వోలె.

నీవు నను వీడి అటు పోయినావొ లేదొ
నన్ను మోయుట కిప్పు డే నాగు రాదు,
రాదు నన్నెత్తి త్రిప్ప నే రాజహంస,
తెలిసి వచ్చెను దేవి ! నీ విలువ నేడె.

దేవి ! నీవు చెప్పిన పని తీర్చి, తిరిగి
వచ్చుట కెటనెట తిరుగవలసి వచ్చు
నో, అదెంత కాలము పట్టునో; అరుదగు
బలముకై తాకనిమ్ము నీ పాదములను.

ఇంతవర కెట్లు దేవి ! నే నిచట నుంటి
నెరుగరా, దిపు డిది భరియింపరాదు:
అడ్డుగా నున్న ఈ గోడ కంత పాకు
రే కల, దటు నీవైపు చేరెద నదెట్లు ?

తోచిన ద దేదొ చేసితి, తోచి తోచ
నిదియు చేసితి దేవి ! ఇటు దటు చేసి
అటుది ఇటు చేసి పొంగి, నా యంత వార
లెవరు లేరంటి: మూర్ఖుని కెవరు సాటి ?

ఎవరినో కొట్టదలచి నే నెప్పు డేదొ
చింత చేయుటే తప్పు ఏ చింతనైన
చిటికెలో మాన్పగల చింత చేయలేదు,
ఇపుడు నేనిట్లు దేవి ! చింతించుచుంటి.

ఒక అమాయకుడైన వానికి చెరగని
పంగనామాలు పెట్టి అపారమైన
ప్రేమను నటించగలుగు ఈ పిరికివాని
నెట్లు దయజూచెదవొ దేవి ! ఎరుగలేను.

ఎత్తుగడలతోడ ఇంత కాలము నేను
గడపినాను దేవి ! కాని నన్ను
నమ్ముకొన్న వారి నమ్మకమ్మునె పొంద
లేదు, మనసు కింత లేదు శాంతి.

ఎవరి నెక్కడ నేరీతి ఎపుడు కొట్ట
వలయునో అట్లు నే కొట్టగలుగు టెరిగి
నట్లు దేవి ! నిన్నెక్కడ నెట్లు పట్టు
కొనవలయునో విచారించి కూడ ఎరుగ.

నమ్మ బల్కుదునే కాని నమ్మ నెవని
నంచు కడు నమ్మకమున గర్వించియుంటి;
నన్ను నమ్మించుటే కాని నన్నెవండు
నమ్ముటయె లేదనెడి విషయ మ్మెరుంగ.

దేవి ! నేనేదొ చదివితి, తెలిసికొనిన
దేమి లే, దితరుల కింత కేమి తెలిసి
పదవి నా కిచ్చిరొ ఎరుకపడదు, కాని
ఎరుకగల వారి నెగురగొట్టించినాను.

ఎటనొ దొరికిన శ్లోకము నిట్టె పట్టి
సాగదీసి తీసి పదారు సభలలోన
పాడినదె పాడితిని దేవి ! ప్రజలు నవ్వ,
విర్రవీగితి నేనె వివేకి నంచు.

నేనె సలహా నొసంగితి, నేనె ఇతని
ఆపదల నెల్ల తొలగించి ఆదుకొంటి,
నేనె లేకున్నచో ఇత డెక్క డుండు ?
అనెడి నా గర్వమున కేది అవధి దేవి !

ఏడు తప్పక నీ కొండ కిట్లు వచ్చి
చిత్తశుద్ధితో పూజలు చేయుచుంటి
బ్రతుకు తెరువు కింకొక పాట పాడుచున్న
నాకు నిక ముక్తి దేవి ! ఎన్నటికి లేదొ ?

ఎవరి కొరకొ నే నెప్పుడో ఇచట పన్ని
న ఉరు లివి దేవి ! ఇప్పు డీనాటి కిట్లు
నాకె ఉరు లైన; విది తగిన తగవె యగు
నేమొ, నన్ను దయ గనుట ఇట్టి లేమొ.

చేను నీదె. కాదన దేవి ! చేను లోని
పంట నీదె, కాదన: కూలి పనికి నన్ను
పెట్టుకొనవు కాదన: కాని, పేగు లేడ్చి
పరిగకై రాగ రానీవు: బ్రతుక వలదె ?

పాల వలెనె తెల్లని దని, పరిచయములు
కలవని, మనసు లో తెరుంగకనె నమ్మి
కొమ్ములున్నట్టి ఒక వృషభమ్ము చేత
దెబ్బతిని, ఏడ్వగా నీకు దిక్కెవడని
దేవి ! నీవును రాగాలు తీయవలెనె ?

దుష్టులకు దూర ముండుము, దురిత మేది
అంట దని దేవి ! ప్రేమతో నంటి వీవు,
కాని, నే కోకిలను కాను కాకినే, అ
యినపు డిక కాకులకు దూర మెట్టు లుందు ?

పగయె పెంచుకొనెడి నాకు పడినవారు
పడని వా రనునది ఏమి పట్టకుండ
ద్రోహ చింతల లోననే తూగుచుండ
పచ్చదన ముడిగెనొ దేవి ! పడితి క్రింద.

వ్రేలెడంత యైనను లేడు, వీని ముఖము
నందు నింత వెలు గిదేమి ? యనుచు దాని
నార్ప నెంత చేసితినొ అహరహ మంత
నా వెలుగె దేవి ! ఇపు డారినది: ఇదేమి ?

మొన్న మొన్నటిదాక ఎన్నెన్ని లేళ్ల
జంపి నెత్రు త్రాగిన పులి సాధు వట్లె
వచ్చి చేరి లేళ్లను నమ్మబలికె, తానె
మనసు కనిపెట్టి పెంచ సమర్థ నంచు;
దెబ్బ తినునొ, ఈ లేళ్ల కే దిక్కు లేదొ.

ఇతని నిటు పొగడి పొగడి ఏదొ పొంది
అతని నటు తిట్టి తిట్టి నే బ్రతుకుచుంటి;
దినదిన మ దేలకొ బరువు దిగుచునుంటి,
ఇంత తిన్న దంతయు పోవు నెచట ? దేవి !

ఈ మిణుగురు పురుగు గని ఏమి వెలుగు
కనులు మిరుమిట్లు గొల్పిన వనుచు పొంగి
దేవి ! నీ వెల్గు, తత్వమ్ము తెలిసె పో యు
టన్న నా అవివేకము నణచ వేమి ?

ఇంతకు పశుత్వమునె నే తరించలేదు
మనిషితన మలవడలేదు, మనసు నైన
గెలువనే లేని నే నేదొ గెలిచితి నని
క్రింది క్రిందికే దిగజారి కేరుచుంటి;
పై కెగురుటకె కృషి, క్రిందపడుట కేల ?

దేవి ! తన మానమున తా బ్రతికెడి వాని
నేదొ కదిలించి, నను గౌరవించ డని మ
తి చెడి ప్రాణము మీదికే తెచ్చుకొంటి,
రాజు నైనంత ఇంత గర్వ మ్మిదేమి ?

ఏదొ ఒక భేదమును సృజియించి, పాశ
వికత నొక్క పల్లకిలోన బెట్టినాను
దేశమున ఊరు వాడల త్రిప్పి త్రిప్పి
చెప్పరాని మహాసేవ చేయుచుంటి;
తొలి అధిపతిత్వమును కోరి తూలుచుంటి.

ఒక రెవరినొ నా వాడె అనుకొని నమ్మి
చేర, నతడు నమ్మెనొ, నన్ను చేరదీసి
కొలుపుగొని క్రక్కిన విషము గుండె నింపి
తెచ్చితిని దేవి ! నీ స్వామి కిచ్చె దటవె.

శాంతిదాయక మగు నొక్క సాధుగృహము
నందు నిలిచి, నేనున్న నా ఆత్మగౌర
వమునకే భంగమని ఆ గృహమున కగ్గి
పెట్టదలచి నా నొక ఇల్లు కట్టలేక:
అవధిలేని మూర్ఖత్వమ్ము కవధి గనను.

కారణ మదేమొ, నిన్న నొకండు నన్ను
గిల్లె నని నే డతని గొరికితిని పట్టి,
ద్వేషమునె పంటగా వేసి దీని నిట్లె
అరయుచుంటి విషపు తడి యారకుండ
బ్రతుకు లటు మాడె, నే నట్లె భగ్గుమంటి.

లేని రాజ్యము నూహించి లేని పోని
ఆశలను పెంచుకొని, రాజు నయ్యెద నని
లేని శత్రువు నూహించి నాను నేను
కసరుకొని గాలిలో కత్తి విసరినాను;
కత్తితో కూడ గాలిలో కలసినాను.

ఎగురుదము పైకి పద, యని ఎగురుచున్న
పక్షులను చూచి ఒక పక్షి పకపక నగి
'ఎగురుటకు కాదు మీ రెక్క, లిచటి మట్టి
చెరగిపోయుట' కనె, నవి 'చెరగు టెట్లు ?
చూపు' మన, చూపు చెడి ఇది చూపి చెడెను.

కయ్యములనె పెంచుచు వెనుకటి దినాల
నరికె తలలెన్నొ, దీనిని విరుతు ననుచు
చిలుముపట్టి తనంతనె చెడుచునున్న
కత్తి చిలుమును విషముతో కడుగుచుంటి,
విషపు నా బుద్ధి కీవు నవ్వెదవొ ఏమొ.

ఇంత కీ మట్టి నుండి ఒకింత యైన
లేవనే లేదు దేవి ! నే లేచు టెపుడు ?
తీగనై మొగ్గ తొడుగుచు సాగు టెపుడు
పైకి ? పూచి నే నెప్పుడు ఫలము నౌదు ?

'వెలుగు నగల హంస'లో ఇది కదంబ కుసుమము

# చాంపేయ కుసుమము



దేవి ! ఆ బ్రహ్మ గ్రంథిని నీవు కనుక
అట్లు భేదించగలిగినా, వగ్ని భయము
చేత నే నట్లు చేయనే చేయలేను;
మణుల వెలుగొందు నిన్నె నా మది దలంతు.

భయము బాపుచున్నవి, ఏదో బలము నూది
నను నిటారుగా నిలుపుచున్న విట, దేవి !
ఎండిపోయినట్లున్న ఈ ఎముక లందు
నెట్టి ఉపనిషత్తులు గూడుకట్టుకొనెనో !

సత్యము తెలియరాకుండ జటిలమైన
తెర అదేదొ అడ్డు కలదు, దీనిని తొల
గించు మని దేవి ! నిన్ను ప్రార్థించుచుంటి
నింతకాలమ్ముగా, రా దొకింత కరుణ.

దేవి ! నిను జేరు మార్గము తెలియు కొరకు
గురువునే చేరు మందువు, గురువు నెచట
వెదకుదునె ? పుణ్యకాల మీ వెదకు కొరకె
గడువవలెనె ? నా గురు వీవె కావె, రావె.

ఈ శుభాశుభ కర్మల నెంత కాల
మిట్లు చేయుచుండవలెనె ? ఎంత కాల
మీ బరువు నీ భువిని దేవి ! ఈడ్వ వలెనె ?
పాము తన కుబుసము నుండి బయట పడదొ ?

దేవి ! ఈ విశ్వమున ఎయ్యది కలదొ అది
అంత నీ చేత వ్యాప్తమై అలరుచున్న
దని ఎరుంగుదు కాని నా మనసు వినదు,
నమ్మదు, ననుజూచి ఎపుడు నవ్వునేమి ?

అన్న మున్ననే పుట్టుక, అన్న మున్న
నే బ్రతుకుట, అన్నమునకె ఈ బ్రతుకుట,
అన్నమే లేదొ ప్రాణుల కంత మపుడె:
అన్నపూర్ణవు కదవె మా కన్న మిడవె.

పరుల ధనము నాశింపక ప్రాణముకల
యంత వరకు పెద్దలు చెప్పినట్టి పనులు
చేయుచు బ్రతుకు మని బోధ చేయనైన
మనసు వినదేమి ? దేవి ! ఈ మర్మ మేమి ?

అణువు కంటె సూక్ష్మమైనట్టి నీ యందె
ఇన్ని జగము లుండు టేమి ? దేవి !
ప్రాణమె యట నీవె, వాక్కు వట, మనసు
కంతు పట్ట దే యొకింత నాకు.

ఆత్మ నిగ్రహ మెరుగ, సత్యమ్ము నెరుగ,
తపము జపము నెరుగ దేవి ! ధ్యాన మెరుగ,
బ్రహ్మచర్యమ్ము నెరుగ, నభ్యాస మెరుగ
ఇంక నిన్నెరుంగుట ఎట్లొ ఎరుగరాదు.

ఏదొ చదువగా వలె నని ఇన్ని నాళ్ల
కింత బుద్ధి పుట్టి చదువనెంచి నంత
ఎన్ని తాపములే దేవి ! ఎండ, వాన,
చలియు మరియు గ్రహము లేవొ చంపుచుండె.

ఎంత మెత్తగా మాట్లాడ నెంచినానొ
అంత పరుషమ్ముగా మాట లాడుచుంటి;
దేవి ! నా నోటిలో అగ్ని దేవు డిపుడు
కాపురమె చేయునటవె నా కన్నుగప్పి.

కనుల కెవ్వరో గంతలు కట్టి ఈ భ
యంక రారణ్య మధ్యము నందు వదలి
నా, రిట కిక ఏ ఒక బాటసారి రాడొ ?
దేవి ! ఇల్లు చేరెడి త్రోవ తెలుపలేడొ ?

చెట్టు - బీజమ్ము నుండియే పుట్టు ననుచు
నెరిగితిని కంటజూచి నే నెపుడొ దేవి !
ఇన్ని కొండలు, జలనిధు లెట్లు పుట్టి
వచ్చెనో నీ వలన నింతవర కెరుంగ.

చెట్టు లోలోపలనె యుండి చిగురుటాకు
మొదలుగా ఫలము వరకు కదలికలను
కలుగజేసెడి దేవి ! వృక్ష మటులైన
ఏల కనిపించలేనొ, నీ కింత నేను ?

చేయదగినట్టి పనులేవి చేయలేదు
చేయదగనట్టి పనులేవొ చేసినాను
దేవి ! ఇది పాప మగు నం(డ్రు; దీని నుండి
ఇపుడు రక్షింపు, మీ పాప మింక తలప.

చేరగా లేదు కన్ను నీ చెంత కింత,
మార్గ మొక్కింత తోచదు మనసుకైన
ఎదుట నిలిచితి వేమొ నా కెరుకపడవు
దేవి ! ఇట్టి నిన్నెట్టులే తెలియగలను.

తలను చూడగా ఉదయపు వెలుగు లూరు
కన్ను చూడగా సూర్యుని కాంతి కురియు
నోరు చూడగా అగ్ని జాల్వారుచుండు
దేవి ! ఇది ఏమి గు(రమో తెలియ దేమి ?

దేవి ! ఈ భూమి, కొండలు. దిక్కు, లిన్ని
తరు లతలు, నోషధులు, మబ్బు, లురుము, రే బ
వలు, నదులు, సూర్యు, డగ్ని. చుక్కలును. గాలి
అరయ, నీ అవయవములే నట, నమోస్తు.

దేవి ! నన్ను నీ భయములో నీవె ఉంచు
కొనుము, లేదేని నా విధులను మరచెద
నేమొ: గాలి. సూర్యుడు, నగ్ని, ఇంద్రు డెపుడు
నీ భయముచే గడె విధుల నెరపుచుంద్రు.

కాలమో, స్వభావమొ. లేక కర్మ ఏమొ
పంచ భూతములు, యదృచ్ఛ, ప్రకృతి ఏమొ
జీవుడో, మిథునయోగమో – ఈ విచార
మేల నా జన్మకారణ మేమి? యనుచు;
అన్నిటికి దేవి ! మూల మీ వగుదు కదవె.

నన్నెవరి కిచ్చెద వటంచు నాన్న నడిగి
అడిగి విసిగింప, కోపించి, యముని కిత్తు
నని పలికినంత నే నట్లె యమునిజేరి
మృత్యువు నెరిగి, నా తండ్రి కెరగినాను.

నా ముఖము, కనులు, చెవులు, నాసిక, హృద
యమ్ము, నాభి ద్వారములుగ – అగ్ని, రవిని,
దిశల, గాలి, చంద్ర, యముల దేవి ! ఎపుడొ
చేర్చినావట, నన్ను రక్షించుకొరకె.

నిన్నె తెలిసికొన్న నీవె నే నౌదట
దేవి ! నా కొకింత తెలిసి రావె,
ఉన్న గ్రంథు లేవొ ఊడి శోకము, పాప
మన్ని పోయి అమృత మౌదు నంట.

నీవె ఉండుట వలననే దేవి ! ఎండు
గడ్డి పోచనే ఆ అగ్ని కాల్చలేదు.
దర్పము వహించి గాలి కదల్పలేదు.
పంతమును బూన డింద్రుండు భంగపడడు.

కాంతి సంద్రమై నీవు నా కాయమంత
పరచుకొని యుంటివి కదె, నా బలము నీవ
యైనపుడు, బలహీనుడననుచు దేవి !
నాకు దొరుకలే నను టేమి న్యాయ మగునె.

బ్రహ్మ లేడు, విష్ణువు లేడు. పరమశివుడు
లేడు, వారి లోకము లేవి లేవు దేవి !
అందరికి ముందు నీ వుండి, ఆత్మ దలచి
సృష్టి జేసితి లోకాల నిన్ని మాకు.

మాటలో ప్రణవరుచుల మూటగట్టి
మాటలాడెద దేవి ! నీ మనసు పొంగ,
మంచి మాట ఒక్కటె వేదమంత్ర మగును
మాటయే సారమౌ కదా మనిషి కెపుడు.

శాస్త్ర మది యేలనే దేవి ! సర్వ శాస్త్ర
సారభూత మయిన నిన్నె కోరుకొందు;
పైనగల ఊక విడిచియే లోననున్న
బియ్యమునె కదా కోరును పిట్టలైన.

సత్యవచనమ్ముతో నే నసత్యములను
పలుకుచుంటిని, మంచితోపాటు చెడ్డ
తలపులను చేయుచుంటి: నా పలుకునను, మ
నసునను దనుజులే దూరినారొ దేవి !

కనులు, ముక్కు, చెవులు. నాల్క. కాయములకు
దేవి ! నీ వింతయైనను తెలియబడవు.
కాని ఈ ఇంద్రియములు నీ కరుణ వలన
తెలియబడుచుండె నని నాకు తెలియుచుండె.

విషయముల పట్ల ఆసక్తి విడువదలచి
ఇంత నా మనసును నిరోధించుచుంటి
కాని, దేవి ! విజయ మింత కలుగ దేమి ?
నీ వయి ఒకింత పూనుకొనిననె జయము.

ఒకటి నా కుడి భుజము, మరొకటి నా ఎ
డమ భుజ. మొకండు పుచ్ఛ భాగము, మరొండు
నా సమున్నత శిరమయి నన్ను జేసె;
వేదముల రూపమే నేను, వెలుగు నీవు.

ఈ పరాపర విద్యల కేమి గాని
మూలమే లేని ఏ వాద మేల కాని
ఏది నీ పాద మింత నా కిమ్ము దేవి !
ఏది కనిపించునో చూచి ఎరుకపడుదు.

నేను నిన్ను దర్శించితి కాన, దేవి !
ధనము, దీర్ఘాయువు కలుగునని ఎరుగుదు;
మరణము వెనుక దేవి ! ఆత్మగతి ఏమొ
ఎరుగ, నెరిగింపు; మిదె నాకు వరము, పరము.

నీవు లేపగా మేల్కొంటి, దేవి ! నీవు
చేర్పగా ఆశ్రమములోన చేరి, గురువు
తెలిపిన ఉపనిషత్తుల తెలిసికొంటి:
బాట పూబాట, అది కత్తి పదును కాదు.

‘వెలుగు నగల హంస లో ఇది చాంపేయ కుసుమము

# పాటలీ కుసుమము



కోరి పద్మాసనము వేసికొన్న నేను
చూడగా త్రికోణపు దివ్వె గూడు నైతి
దీని హృదయ మధ్యము నందు దేవి ! సూర్య
దీపిక వయి వెలుగ రావె, దిగులు చెదర.

కనికరించి నన్నుద్ధరించినది లేదు,
మణికిరీట మీ తలను పెట్టినది లేదు,
ఇంతగా పెత్తనము చూపె దేల ? దేవి !
ఎంత మెత్తని వాని కే నెముక లుండు.

చంద్రవంక ఉండగనిమ్ము, ఇంద్రధనువె
సొగసు పూల్ రాల్చనిమ్ము, నీ మొగము జూచి
దేవి ! మురియు వారెవ్వ రీ దెసల లేరు;
నీ వెవరి తల పాల్వోసినావు కనుక.

త్రాగు నీటికై ఒకబావి త్రవ్వుచుండ
దేవి ! ఈ భూమి గుణమేమొ దీనిలోన
బాధలే ఊరుచున్నవి, బ్రతు కిదెల్ల
బాధలనె తోడుకొని త్రాగవలెనొ ఏమొ !

అన్ని మబ్బు లాకాశ మందంత ఉరిమి,
భూమినే ముంచ దండెత్తబూని మెరసి,
దేవి ! నీ చిన్ని ఊర్పులో దిక్కు చెడెనొ ?
వాన చినుకు పడిన ఆనవాలె లేదు.

ఎచటి కేగిననగాని ఒకించుకైన
మరువక నను నీ వైపుకె మరల జేసె
దీవు, కలుగనున్న అపాయ మెపటి కప్పు
డెరుక పరచెదు దేవి ! నా ఎదుటబడవు.

దేవి ! నీ సృష్టియే యైన ఈ విశాల
విశ్వసౌందర్యమును గని ప్రేమ నెంతొ
చిలికి, ఏలకో నిన్నె ద్వేషించినాను:
పాము పగ, తోక చుట్టంబు వలె నిదేమి !

జడలు, నొడలంత బూడిద, సర్ప మొకటి
బుసలుకొట్టుచు, ఓ దేవి ! బూచి వలెనె
యున్న శివుడంత ప్రియ మటె ? ఊహ లల్లి
కన్ను కదపక చూచెదు నన్ను మరచి.

అది అమావాస్య, దరిలేని అర్ధరాత్రి,
తీవ్రమౌ గాలివానలో తీర మెరుగ
నంత దూర మరిగి ఒక అంచ పడవ
కడలి కెరిగించె కష్టాల కడలి నుడులు.

ఇంటిలో నుండు మనుచు న న్నిటకు పంపి
తీవు కాని తాళపుచెవి నీయలేదు,
లోనికే వెళ్లలేనైతి నేను దేవి !
బయటనే తెల్లవారునే బ్రతు కిదెల్ల !

ఇంత నీటి కొరకు దేవి ! ఎంత లోతు
త్రవ్వితినె బావి, నిక మరెంత వర కిట్లు
త్రవ్వవలెనె ? ఎప్పటికైన దప్పి తీర్చ
గలవనెడి నమ్మకమున నే నలస టెరుగ.

ఇన్ని గాయముల నెడద కెందు కొరకె
చేసెదవని ఇంతవర కేడ్చితిని కాని,
ఎరుక కల్గించుటకె గాయ పరచె దీవు;
దేవి ! గాయమే నీ భాష తెలిసివచ్చె.

ఇన్ని విత్తనా లేటేట ఈ పొలమున
విత్తుచుంటి, నొక్కటి మొలకెత్తలేదు,
అన్ని బుగ్రలే నటె ? ఒకటైన పెరిగి
పక్షు లొక రెంటి కక్కరపడదొ దేవి !

ఇన్ని వేల లక్షల ఆకులున్న చెట్టు
కొక్క ఈ ఆకు దేవి ! లేకున్న నేమి ?
ఉండి, చెట్టుకు తానేదొ ఒరగబెట్టు
చున్నటుల పెద్ద గర్వించుచుండె నిద్ది.

ఎందు కింతటి దెబ్బ తాకించుకొంటి
వీవు, క్రిందచూచి నడువ వేమి ? అనుచు
కణత గాయమ్మునకు కట్టు కట్టె దీవు
కాని, మెరపు కావటె మబ్బు క్రమ్మినపుడె ?

ఏమి కోరి దేవి ! ఇంతచేసితి ? విధి
శివుని చిత్త మలరజేయునటవె ?
ఒక్క రిక్క పూవె ఒక్కటే ఉన్న ఈ
అడవిలోని చెట్టు కంద మేమి ?

కోరిక లి వేమిటే, ఇవి తీరినపు డ
దెంత ఆనంద మొదవునో అంత కంత
కధికముగ క్రోధ మవి తీరనపుడె కలుగు
చుండె, మనిషితన ముడుగుచుండె దేవి !

చిన్నతనమున నీ ఒడిజేరి దేవి !
ఇంపు మీర నీచేత లాలింపబడితి;
బ్రతుకుతెరువుకై ఇటకు దూరముగ వచ్చి
ఇసుకగూళ్ళు కట్టగలేక నిట్టులుంటి.

చేదబావి నీటిని కొంత చేదదలచి
ఇంతవర కెన్ని త్రాళ్ళనో ఎదురువేసి
అందనైతి నీ రొక బొక్కైడైన దేవి!
త్రాడు ముడులూడి బొక్కెనే దక్కదేమొ!

తెలిసినదె వేద మనుకొన్న దినములందు
నాటుకొన్న దీ ముళ్ళ వనమ్ము దేవి!
నీ చిగురు పాదములకు గాని ఇవి గ్రుచ్చు
కొనునొ, ఇటురావలదు నీవు కనికరించి.

దేవి! అంత సులభముగ తెగని నేల
ఇది, వలసిన బలము నాకు మొదలె లేదు,
గట్టిదె యగు ఈ మొనలేని గడ్డపార
నిచ్చి త్రవ్వు మంటివి, బావి ఎపటి కగును?

దేవి ! ఆ మబ్బు చాటున తీక్ష్ణకరుడు
సూర్యు డున్నట్లు నా మనసుకు తెలియును
కాని, లాభ మేమైనను కలదె నాకు ?
మబ్బు విడిననే కద మాయమబ్బు విడును.

దేవి ! ఏ బీజముల నెప్పు డీ విశాల
భూమిలో నాటితివొ కాని పూలు మాత్ర
మివియె, నీ పూజ కుపకరించు విధముగ వి
రిసినవొ, కలవొ లేవొ పరిమళములు ?

ఇటు నటు నెటకు పరుగెత్తనీయకుండ
అన్ని ద్వారములను మూసి అదరగొట్టి
దీవు దేవి ! ఏదొ మిషగ; ఇంక నీ ప
దముల కొలువ నిమ్మననులే: తప్పు నాదె.

దేవి ! నను పైకి లాగుచున్నావు కాని
ఏదొ ప్రేమించి నను క్రింది కీడ్చు ప్రకృతి:
బలములను తేల్చుకొన మీరు తలచినారొ,
వాడుకొందురె నన్నొక్క త్రాడు జేసి.

దేవి ! నన్ను నీ ఒడినిడి తీరుబడిగ
ఈ చిరు పదముల మహార్థ మిది యటంచు
వ్రేలు చూపి చెప్పుచు చదివింపరావు;
పదము విడిచి చదువుచు నీ పదము గనను.

నేల నతడు దున్నిన రతనాలు పండె,
నేల అదె, నేను దున్నిన తాలు పండె,
కౌలు భూమికి దేవి ! ఈ కన లిదేమి ?
తల గడుగరాదొ నా దరిద్రమ్ము పోవ ?

నన్ను బాధ పెట్టితి వని నిన్ను బాధ
పరచి నీ కింత దూరమై బాధపడుటె
కాని, ఈ బాధలకు దేవి ! నేనె ఆది
మూల మనుభావ మిపు డెద మూల విరిసె.

దేవి ! నీ పాదములను నెత్తిపయి బెట్టి
ఈ గతి మరెంత కాల మూరేగవలయు ?
ఇంతకును నీ హృదయమున కెత్తుకొనవు
'బరువు నీ' వన్న భావన బాపలేవు.

దేవి ! పుట్టినప్పటినుండి తిరుగుచుంటి,
ఎంత వర కుండవలయునే ఇట్లు గుడి బ
యటనె ? ఈ ప్రదక్షిణముల కంతు లేదొ ?
లోని కరుదెంచరాదటే నేను గాని ?

నన్ను చైతన్యపరచెడి నదిని దేవి !
పాతి పెట్టినా డోర్వని వా డెవండొ
దీని గలగలలు వినక దిక్కు చెడితి
మరల విందునా నీ గళస్వరము వోలె.

నా మెడ కదెట్లొ చుట్టుకొన్నట్టి ఇన్ని
తీగలను చూచి దేవి ! నే తెలివిగ విడి
పించుకొన నెంతగా ప్రయత్నించినానొ
అన్ని ఉరులు బిగిసి ఊపి రాడలేదు.

నాలు గడుగులు నీ వైపు నడువలేదు,
నలుబదియె కాదు నాల్గు వందల అడుగుల
ఇంత ఎత్తుపై కెగిరి నే నిట్టులుంటి,
దేవి ! మెరపు కత్తులు త్రాడు తెంపునేమొ.

నిన్న విసరిన శస్త్రమే, నిన్న వేసి
నట్టి అస్త్రమే, నిన్నటి అక్షయమగు
దొనలె ఇవి, నిన్నటిదియె ఈ ధనువు, కాని
అన్ని ఇపుడు నిరుపయోగ మయ్యె దేవి !

నేను నీ చూపు చక్రములోన ఇట్లె
దేవి ! ఎంతకాలము మున్గి తేలుచుండ
వలెనె ? అటు నేను మునిగినట్టులను కాదు,
హంస వలె పూచి ఇటు లేచినటుల కాదు.

నీవు పూచి పరిమళించి, నీ పరిసర
ముల కొక వెలుగు సొగసుల నలదు కొరకె
నేను పూచి పరిమళింతు కాని, నన్ను
నేను నీ కిచ్చుకొనుటకు కానె కా,ద
టంచు విరియబూసిన చంద్రు డనెను దేవి !

పరిమళములై జాల్వారు ఈ పాల కొలను
నందు దేవి ! ఈ రక్తపు టల లివేమి ?
హంసి కాలికి మెత్త నైనట్టి చిన్ని
కత్తి కనిపించు, నిన్నటి గజ్జె లేదు.

బయటి మట్టి నేనయి దేవి ! పట్టి తెచ్చి
ఇంట వేసి ఆనందించుచుంటి: పిదప
ఇంట నిది ఏమి టని అసహ్యించుకొంటి:
వేరు బుద్ధుల పోరేమి వేళ మూర ?

మనసులో నుంటి వను మాట మరచిపోయి
తిరిగితిని దేవి ! గుళ్లు గోపురము లెన్నొ;
దృష్టి బడిన నిన్నె అలంకరింపనెంచి
నన్ను నగలుగా చేసికొన్నాను నేను.

మాట లెవ రెన్ని అన్నను మాట లెదురు
చెప్పి ఎరుగని మెత్తని శిలగ పుట్టి
నంత ఇది ఏమొ, ఈ లోకమంత దేవి !
వాడుకొనె నన్ను తొక్కుడు బండ జేసి.

వేదములతోడ దేవి ! నివేదనల నొ
నర్చ గల యంత కాదు, స్వర్ణముఖి జలము
లట్లు నోటితో దెచ్చెడు నంత కాదు;
మధ్యతరగతి నా భక్తి, మనసు పడుదె.

వేసిన ఎరువె విషమయి వేరు జెరుప
ప్రాణశక్తులే ఉడిగి ఈ పగిది నుంటి;
దేవి ! కోకిల నిటు పంపి, దిక్కు చెడిన
నా పయి వసంతమును పాడ నోపగలనె ?

కాకుల వలెనె ఈ మబ్బు లేక ధాటి
గా నుదయ చంద్రుని తరుమగా, నతనికి
దిక్కు తోచలేదో, తూర్పు దిక్కునందె
అడగె నీవుండగ ననద యగునె? దేవి !

పెట్టుబడి అప్పు, చల్లెడి విత్తనాలు
నాగు, భూమి కౌలుకు గొని, నన్ను నేను
దున్నుకొన్నట్లె దీనిని దున్నినాను,
నేనె పంటనై అమ్ముకొన్నాను నన్ను.

పాక చెక్కలు త్రొక్కుచు, పలక బట్టి
నాడె నటు కొట్టి ఇటు కొట్టి ఆడిపాడి
నట్లు మగ్గము నేసితి, నైన చీర
కాదు: చూడ, దారపు కండె లేదు దేవి !

దేవి ! నీ విచ్చిన పొలము దీసికొంటి
వి, గృహమును తీసికొంటివి, వెలుగుచున్న
దీపమును తీసికొంటివి; తిరిగి తీసి
కొనెద వటె, ఈ ఫలము తీయదనము కూడ ?

తుమ్మలను కొట్టివేసి, గోతులను పూడ్చి
వేసి, గొఱ్ఱు కట్టి చదునుజేసి, కంచె
వేసి, పచ్చని ఒక నీడ వేసినావు,
ఎరియు భూమిపై దేవి ! నీ కెంత జాలి !

అంత శస్త్రాస్త్ర సంపన్నుడైన నేమి,
అతడు గెలిచెనా బ్రహ్మర్షి నంత జేసి,
బాహుబలము బలమె కాదు, బల మటన్న
దేవి ! ఒక తపోబల మంచు తెలిపినావె !

ఆ అమాయకుడగు శివు డంకతలము
న నిను కూర్చుండగా బెట్టుకొనిన అలుసు
చే నతని సెంతకయిన తెచ్చితివి, నీవు
ఆడు మన్నట్లె తలయూపి ఆడినాడు.

ఎంతటి విచిత్ర మిది దేవి ! ఏదొ గాలి
వచ్చి నిన్న ఎవ్వరొ కట్టి పచ్చరాళ్లు
పొదిగినట్టి మేడయె తూలిపోయె: గడ్డి
పోచల గుడిసె రతనాల పుక్కిలించె.

పాతకాలపు నాటి వీ బట్టు, లెవ్వ
రే మనెదరొ ఈ బడిపిల్ల లింద రనుచు
బెరుకుతో నేగ, లలిత సుందర సుమ సదృ
శము లివి యటంచు దేవీ ప్రశంస చేసి.

పద్యమే మావియై దేవి ! బ్రతుకు గనగ
కోకిలలు వచ్చి పాటల గ్రుమ్మరించె,
చిలుక లిటె వచ్చి ఫలముల పలుకరించె,
పథికు డొక రసానందుడై పరిమళించె.

అలల కలల మాలికలకు నంతరంగ
పు పరిమళము లలది నే నిపుడు కడువడి
కడలి నిదె వచ్చుచుంటి నీ కడకు దేవి !
సార సంసార సాగర తీర మీవు.

శ్వాస యనెడి ఒక లతకు నా సుమ సదృ
శపు మనసనెడి ఒక కలశమును గట్టి,
దేవి ! చంద్రు డనియెడి ఆ బావి లోన
దింపితి, నొకింత సుధ నందు నింపె దటవె ?

'వెలుగు నగల హంస'లో ఇది పాటలీ కుసుమము

# మందార కుసుమము



అక్షర స్తంభముల నిటు నటొక టొకటి
నిలిపి, హంసవలె వెలుగు చిలుకు మరొక
అక్షరపు టూయలపయి నా అలిక మందు
నూగె శివుని అంకమ్మునం దొదిగి దేవి.

ఈ చెవికి ఏదయిన వినిపించునేమొ
యని తలచి దేవి ! నీదు ఒడిని తల నిడి
వినుచునుంటి, తపించెడి మనసు పెట్టి,
గుండె ఇంత చప్పుడు చేయకుండ జేసి.

మనసులోనె ఉందువని నీ మార్గ మరయ
నెంచి చూచినా, నేమి కన్పించలేదు
నాకు; నీ వింత కొక నవ్వు నవ్వలేదొ ?
చంద్రు డమృతమ్ము పూచిన జాడలేదు.

ఉన్నవన్ని మరచిపోయి నిన్ను కొలుచు
వారికే తప్ప నావంటి వాని కింత
ఆత్మవిద్యావిలాసమే అందరాదొ ?
దేవి ! నీ వెల్గు గుడి తల్పు తీయరాదొ !

పాద మనెడి నీ సొగసైన బడిని జేర
హంసనై వచ్చితిని దేవి ! అనుమతింతె ?
అందె యనెడి ఉపాధ్యాయి నాశ్రయింప
బ్రతుకు బ్రతుకంత రాగాల పంట యంట.

నీ మనసునె కోదండమ్ముగా మలచియు
పంచ తన్మాత్రలనె తీక్ష్ణ బాణములుగ
జేసి, అనురాగమునె త్రాడుజేసి, లేని
క్రోధము నొక భయంకరాంకుశము జేసి
ఎదుట బడినంత భయమంద నింత దేవి !

శ్వాస ఊయలపై తేలివచ్చుచుండె
మనసు నినుజేర దేవి ! దర్శనము నిమ్మ,
చెప్పవలసిన పాఠాలు చెప్పి, చూప
దగిన లోకాల చూపు, నేత్రమ్ము నిచ్చి.

నేను తపమెంత చేసినన్నైన గాని
దేవి ! పట్టుబడవలదు నీవు నాకు;
నిన్ను వెదకుటలో ఊరుచున్న ఆర్తి
ఆగి, ఈ తీగ పూయుట ఆగునేమొ !

ఇంద్రియము లయిదింటికి నెంత మాత్ర
మందకుండ, వానికె శక్తి నందజేయు
నదియె ఆత్మ యని తెలిపినట్టి దేవి !
ఆత్మ మందార సుమముగా నందరావా !

అచట ఆ ఇంటిలోనున్న అగ్ని దెచ్చి
ఇచట ఈ ఇంట బెట్టినా నిట్లు దేవి !
పరిణతాక్షర సమిధ సంపదలు వేసి
వండుచున్నాను పరమాగ్ని వంటకమును.

నీ వరుని కంటి కలువలకే వికాస
ము కలిగించునంతటి స్వార్థము తగునటవె ?
దేవి ! కనుల తెరువని పొత్తిళ్ల వాని
పై కురియవటే వెన్నెల పాల నిన్ని.

దేవి ! చింతామణుల ఇంట తీరుబడిగ
నుంటివి, సరిపోయినదె; నీ కున్న చింత
లేమి కనుక ఆ ఇల్లు ? నా కిన్ని చింత
లుండె, ఒక్క చింతామణి ఉండరాదొ !

ఎట్టి రూప మగుపడని, దెట్టి శబ్ద
మింత వినిపించనిది, ఇంత ఈ మనసున
కందనిదగు భూమావస్థ అందరాదొ ?
పుట్టుకల బాధ తొలగదో భూమరూప !

ఇన్ని వేల నాడులుగల హృదయమందు
దేవి ! ఏ ఒకటనయిన నీవు ప్రాణ
మై విడువకుండ నుండలే, దనద నైతి;
ప్రాణనాడి వొంట శివుని వరకె యటవె ?

దేవి ! ఆయ నొక సగము, నీ వొక సగ
మై ఒకటగుదు రటవె మీ యంత మీరు;
గుండె గురిగి వండితి ఈ జిగురు, వలదటె ?
కాంచనముల నదుక వెలిగార మట్లు.

నీకు కడు ప్రియమని దేవి ! నేను కొంత
పాయసము వండనెంచి నప్పటికి గాని
కుండ కిన్ని చిన్నవి చిల్లు లుండె నంచు
తెలియలే, దిప్పు డేదారి తెలియరాదు.

నాలుగైదు వందల యోజనముల ఎత్తు
కల్గిన సుమేరు మధ్య శృంగమ్ము నందు
నుందువటె ? దేవి ! నేనింత క్రిందనుండ,
చీమవలె గాని నన్ను వీక్షింప లేవొ ?

అగ్గి గోడలు కట్టించి, అందుకొనగ
రాక ఆ మధ్య నుంటివి, నీ కడ కెవ
రైన అటు వచ్చెదరని భయమ్మొ దేవి !
వరము లని నిన్ను పీడించువారె లేరు.

ఏ ఒకటి తెలిసినయంత ఎల్ల విషయ
ములు తెలిసివచ్చు దేవి ! ఆ ముఖ్యమైన
ఒక్క విషయము నెరిగింపకుండ, నేను
కోరనివి ఏవొ ఇచ్చిన ఊరుకొనను.

అంత పచ్చని చెట్టునే, ఆకు రాల్చి
ఇంత ఆర్తితో కట్టెనై ఇట్లు విరిగి
నన్ను నే నొరపిడి పెట్టుకొన్న నైన
అగ్నివై దేవి ! ప్రత్యక్షమైన కావె !

విరిసి దేవి ! నీ గుడి కింత వెల్ల నౌదు
నని కదే రాయినై పుట్టి అగ్నియందు
జేరి, నే కాలి కాలి చల్లారినాను:
నీవు కురియ వింత కొక కన్నీటి బొట్టు

నాడ ఒక టిచ్చి, గుఱ్ఱము జాడ నిట్లె
తెలిసికొను మని నను పంపె దేవి ఇటకు,
గుఱ్ఱ మన నెట్టిదో కనుగొనదలంచి
తెలిసి చెప్పెడి వారికై తిరుగుచుంటి.

ఉలుకు పలుకు లేక ఉండె నిత డెపుడు
బాగుపడు నటంచు బాధ తోడ
నిడుద ఊర్పు దేవి విడువ, కడలి నేను
హెచ్చు టలల హోరు లెత్తినాను.

తెగిన చుక్కగా ఇట జారి తిరుగుచుంటి
ఎంతగా వెదకినను నా కింతవరకు
తెలిసినట్టి వా డొకడైన కలియలేదు;
తెలిసె దేవి! నేనిట కాటగలసినాను.

కొలిమిలో బెట్టి సమ్మెట గొట్టినపుడు
రూపమున నించుకైన మార్పు నెరుగగనె
లేని దీ నీ మెరపు చూపులే కనినదొ
ఇనుము తీగ సాగుటలు నేర్చినది దేవి !

కదలుచున్న అద్దములోన కదలు నీడ
వలెనె ఈ విశ్వ మెంత చంచలము దేవి !
దీని నమ్మి చెడుదునటె నేను ? నీ అ
చంచల పదము విడువగ చంచలుడనొ !

దేవి ! ఈ మధ్యన చెలికత్తె లెవరె ? నిను
చేరవచ్చునప్పుడు నన్ను వీ రొక రొక
రడ్డగించుచున్నారు, న న్నడ్డమైన
ప్రశ్నలను వేయుచున్నారు, భంగపరుప.

దేవి ! నీ వొసంగిన వెల్గు తీగను గొని
వచ్చుచుండ నెవ్వరొ వెంట వచ్చి, పైన
మచ్చు చల్లెనో, చల్లెనో మందుగాని
చూడ తీగలే, దాతని జాడలేదు.

నన్ను తాకిన ఈ రాయి నాకు చూడ
అందమైనట్టి శివలింగ మట్లె తోచె,
నన్ను గెలువగా అడవిలోనున్న నన్ను
చితకగొట్టి నాతడు దేవి ! శివు డదేమొ ?

ఈ 'అహ'ము మధ్యలో దేవి ! ఎన్ని వర్ణ
ములు కలవు, మంత్రము లవెన్ని కలవు, శాస్త్ర
జాల మెంత కలదటంచు నేల అడుగ ?
కలవు కదె సమస్తమగు లోకములు నిండె.

మంచి యనున దిదేమిటే, మనసుపుట్టి
పట్టుకొనబోవు నంతలో పట్టుబడక
పుసికిపోవు, చేపగ: గురుబోధ లన్ని
ఇట్లె చిక్కకున్న వెలుగు లేవి ? దేవి !

ఏమి కావలెనని దేవి ! అడుగనేల ?
బలము నా ఎల్ల బలహీనతల నెరింగి,
ఏది నాకు కావలెనొ నే నెరుగగలనె ?
పాప నడిగి ఇచ్చునె తల్లి పాల నెందు !

ఇంద్రు డాదిగాగల సురలెల్ల తన కొ
రకు తపించుచునుండ, పరమశివుండు
తానె తప మొనర్చు నదేమి ? నేను చూచి
నేర్చుకొనుట కటె ? ఇదేమి నేర్పు దేవి !

మెట్టు మెట్టు కొక పరీక్ష పెట్టి దేవి !
ఇన్ని మెట్ల నెట్లెట్లొ ఎక్కించినావు,
ఏ ఒక పరీక్షలోనొ తప్పించి ఇపుడు
కూలద్రోతువే పాతాళ కుహరమందు.

దేవి ! నాకేమి పనిచెప్పినావొ కాని
నీ గడప దాటి వీధిలోని కిటు వచ్చి
పడినయంతనే మరచి ఇబ్బందిపడితి;
అడుగు వెనుక పడదు, ముందు పడనె పడదు.

దేవి ! ఈ రథమును కోరి నీవె నీది
కాగ జేసికొంటివి కద, కలరటె ఇపు
డెవ్వ రొకరైన అడ్డు నీ కింత చెప్ప,
నడుపుకొను మింక నీ ఇచ్ఛ నడచినట్లె.

దిన దిన మ్మిదే దారిలో తిరుగుచుంటి
నింత కాలమ్ముగా కాని, ఎరుగ నిద్ది
ఏదొ గుహవోలె నున్న దిదేమి దేవి !
ఇందు నెవ రుందురే ? లోని కేది దారి ?

కన్ను లింత పెద్దవి యైన కానరాదు
దేవి ! నీ రూప మింతైన, తెలియ దేమి
కారణమొ ? ఏ కనుల నిను కనుగొనుటయొ
తెలియ ? దెవరి నడుగుటయొ తెలియ దింత.

తీక్ష్ణముఖి, రసలుబ్ధయౌ తేనెటీగ
పూల ఎదలోని తేనెల గ్రోలు టెరిగి
ఉపనిషద్దివ్య సుమములో నున్న నీ ప
ద మకరంద బిందువు గ్రోలదలచి దేవి !
మనసుపడి వచ్చితి, నొక సాధనము లేదు.

ఎవరొ ఏలకో నన్ను దూషింప, మనసు
చెదరి దేవి ! నే నట్లె చేసితినొ లేదొ
నీటి నేకదీక్షగ నేను నింపుచున్న
కుండ ఇది విచ్చుకొనె పచ్చి కుండ వలెనె.

ఎపుడు కోరిక లేవేవొ ఎన్నొ కోరి
నిన్ను నొప్పించుటే కాని, నేను దేవి !
నీ మనఃప్రీతి కొర కింత కేమి చేయ
నైతి నని ఇప్పు డిట జేరి అడలుచుంటి.

ఎడద లోపలనే కల దెల్ల, బయట
ఎందులో నేమి లేదని ఎరుకపరుప
ఇంతగా నను త్రిప్పగా నేల దేవి !
అనుభవమున కింతటి కాలహరణ మటవె ?

ఈ మొలక ఫల మొసగునా. ఏ ఫల మది ?
అనున దేమి విచారింపకనె ఎరువును
వేసి వలయు నీటిని తెచ్చి పోసినాను,
దేవి ! నీ విచ్చి పెంచు మన్నావు కనుక.

ఇంత మొరబెట్టనైన నా యింట నడుగు
నిడ వయితి వని దేవి ! నిన్నేవొ మాట
లనుటె కాని, మూసిన తల్పుల నిట నీవు
తట్టిన రవళి చెవినింత బెట్టనైతి.

ఎంతసేపటి కతడు నన్నెంత చేసె,
ఇంత చేయునే ? అనుచు నే మేమొ త్రవ్వు
కొనుచు నతని సాధింపజూతు నెపు, డిపుడు
దేవి ! అతడు నేనె యటంచు తెలిపినావు.

రకరకాల చిత్రములైన త్రాళ్లతోడ
దేవి ! నను నేనె ఇట్లు బంధించుకొంటి,
బంధముక్తుడ కాలేక బాధపడెడి
పేదవాని కిప్పుడు నీవె పెద్దదిక్కు.

పగలు రేలు నీ ధ్యాసలో పడినయంత
కలియ దున్నిన మడికట్టు పొలమునైతి,
నాటుకొను మిందు వెలుగుల నారు దేవి !
బండ్ల కెత్తించగల పంట పండునేమొ !

ఇచట కూర్చున్న నన్ను ముంచెత్తనెంచి
దిక్కు దిక్కుల నదులేవొ ఒక్కమారె
ఎంత వడిగ పొంగుచువచ్చె నంత వడిగ
ఇట్లు నిను జేర్చె దేవి ! న న్నెత్తి పైకి.

గాయపడినదో, ఏదరి కానలేక
ఈదగా లేని ఈ చేప నేల దేవి!
పట్టినా వీవు వలవేసి ? బాధ మాన్పి
పెంచుకొందువే నీ కంటి వెలుగు నీట.

వారు నా కర్మ కిట నన్ను చేరవేసి
వారి దారిలో వా రేగినారు, వెలుగు
ననుకొనిన దీప మిది భగ్నమనె, ని దేమి ?
అమ్మ ! మనది నిత్య స్నేహ మాత్మ వలెనె.

ఇంటి కిటు వచ్చి నన్ను నీ వెంట దేవి !
రమ్మనుచు తీసికొనిపోయి ప్రాణములకు
నే పదార్థ రహస్యమ్ము చూపినావొ,
విషయములను నిట్టూర్పుగా విడిచినాను.

ఇంతకును దేవి ! నీ కొర కెన్ని చోట్ల
వెదకినానొ, జపముగ ని న్నెదను నింపి;
నా మనసు కలచోటనే నీ మహస్సు,
శిరము కలచోట నీ పద శ్రీసుమాలు.

దేవి ! పాతాళమున యందె దింపగలవొ,
సకల లోక సామ్రాజ్యమున కధిపతినె
చేయగలవొ, నీ ఇష్టము: చిత్త మిది భ
వత్పద సుమమ్ముల నొకింత వదలబోదు.

అగ్ని రూపమ్ముతో దేవి ! అహరహమ్ము
నా కనుబొమల మధ్యలోనె వెలుగుచు
మనసు నాకట్టుకొన, నన్నె మరచినాను
కనులు రెండైన నేను ముక్కంటి నైతి.

'వెలుగు నగల హంస'లో ఇది మందార కుసుమము

# చైతన్య కుసుమము



ఎంత కాల మా కఠినమౌ హిమశిఖరము
లందె మీ రట్లు తాండవ మాడనేల ?
మెత్తని కమలదళముల నొత్తుగా ప
రచితి దేవి ! నా తలపైకి రారె మీరు.

ఎరుగరాకుండ నా యింటి కీవు వచ్చి
మెల్ల మెల్లగా నా తల మీది కెక్కి
విరిసి మకరంద బిందువుల్ కురిసినావొ
'అమ్మ' యన నేర్చె దేహపు టణువు లన్ని.

అట నొకటి ఇట నొకటిగా ఆరు చక్ర
ములను దేవి ! ఈ నా దేహమునను నిలిపి
అన్నిటి నొక త్రాట బిగించి, అందగించి
నేనె శ్రీచక్ర మైతి నీ నెలవు కొరకు.

నాభి కమలమం దుంటివి. నా హృదయము
నందు, గొంతు, భ్రూమధ్యములందు, శిరము
నందు నుంటివి గదె దేవి ! అరయ నీవు
లేని చోటేది నాలోన లేనెలేదు.

పెరిగి పెద్ద కావలెనన్న ప్రేమ ఏమొ,
నాలుగేండ్లవాడ నయిన నాకు పలక
నిచ్చి దిద్దు మి ట్లని దేవి ఇచ్చె నేదొ
అక్షర, మదియె అక్షరంబగుచు మెరసె.

అలుకుటకు కాల మనుకూల మౌనొ కాదొ
అనునదేలేక అలికితి నక్షరముల,
కాలమును నీవె, మూలమౌ నేల నీవె,
మొలక బల మీవె దేవి ! ఈ మొలక నీవె.

# చైతన్య కుసుమము



ఎంత కాల మా కఠినమౌ హిమశిఖరము
లండె మీ రట్లు తాండవ మాడనేల ?
మెత్తని కమలదళముల నొత్తుగా ప
రచితి దేవి ! నా తలపైకి రారె మీరు.

ఎరుగరాకుండ నా యింటి కీవు వచ్చి
మెల్ల మెల్లగా నా తల మీది కెక్కి
విరిసి మకరంద బిందువుల్ కురిసినావొ
'అమ్మ' యన నేర్చె దేహపు టణువు లన్ని.

అట నొకటి ఇట నొకటిగా ఆరు చక్ర
ములను దేవి ! ఈ నా దేహమునను నిలిపి
అన్నిటి నొక త్రాట బిగించి, అందగించి
నేనె శ్రీచక్ర మైతి నీ నెలవు కొరకు.

దేవి ! ఏ పుణ్యముననొ ఈ దీవి జేరి
కలికి నీ వెల్గు కేతాము కట్టినాను
హృదయ రసరమ్య కేదార మింత నిండి
బ్రతుకు పచ్చలు పొదిగిన బంతు లాడె.

కమ్మతావుల వెలుగు టంగళ్ళ దివము
లోన గ్రుడ్డి గవ్వకు కొరగాని నేను
దేవి ! నీ విప్పు డొసగిన వేవొ కొన్ని
ప్రవిమలాక్షరమ్ములు త్రాగి రాజునైతి.

బయటపడి అగ్ని ప్రవహించి బ్రతుకు కింత
మచ్చ తేకుండ లోలోన వెచ్చగుండ
నిమ్మళముగ నంతర్మ ఖీన మ్మొనర్చి
నన్ను దేవి మహాగ్ని సంపన్ను జేసె.

తినగ తిరిపపు ఒక ముద్ద తిండిలేక
ఆకలిని ఆర్ప నీటి బొట్టైనలేక
ప్రాణ వాయువౌ నిను దేవి ! త్రాగినంత
రక్తమున పూచె పాటల ప్రణవరుచులు.

'ఏదొ పనిబడె, తిరిగి నీ కిచ్చెద' నని
నా కనుల రెంటిని బలవంతముగ వెంట
తీసికొనిపోయి సానలదీర్చి దేవి !
నా కొసగె, నాత డొకరీతి నవ్వుకొనుచు.

జ్ఞానభూమిక లీ నాదు చపలబుద్ధి
కందనేలేదు, గురుబోధ లందలేదు,
అందునేమొకో యని హంస లనుకరింప
మందగతి సాగు నీ పాద మందె దేవి !

శిరసుపైగల పూవుతో చెట్టొకండు
త్రోవ కెదురుగా వచ్చెను దేవి ! చెట్టు
నెక్కి పూవు కోయగ నది ఎగిరె నింగి,
కా వెనుక నే నెగిరినాను హంసవోలె.

పల కయిన మోయగాలేని బక్క పలచ
ని కొడు, కొంటి ఊపిరివాడు, నిలిచి చిరుత
గాలికిని తట్టుకొనడంచు కలతపడెనొ
ఒదిగి శ్వాసగా దేవి న న్నెదుగజేసె.

పక్షి కిలకిల లెట్లిన పట్టదలచి
పరుగులిడి దేవి ! నీ ఒడి బడితినేమొ
నేనె ఒక చెట్టునై లేచినాను, వేయి
పక్షులను పాడుకొన్నాను పరిమళించి.

నేను చదువుచుంటినొ లేక, నిదురబోవు
చుంటినో యని ఇటు చూచుచుందు వీ వ
పు డపుడని, వెల్గు జడిలోన తడిసి పులక
రించెడి గదియె, దేవి ! నా కెరుకపరచు.

నిన్నటికి నిన్న ఆ నీలి నీడ ఏదొ
పాడినప్పుడు, ననుజేర ఆడినప్పు
డింత దేహ మే మయ్యెనో ఎరుగరాదు,
నేడు నినుగంటి దేవి ! ఆ నీడ లేదు.

దేవి ! నే నిచ్చట సముద్ర తీరమందు
నీ కరుణ ఏది, కలదొ లేదో కనుగొన
దలచి, తలచి కూర్చుంటి, అంతటనె నీవు
నవ్వి అలలుగా ముంచెత్తినావు నన్ను.

దేవి ! ఇంతటి సుడిగాలి దిక్కులదర
వచ్చుట నయమే ఐనది. వచ్చినట్టి
మబ్బు లెటకు పోకుండుట మంచికే అ
యినది, మూలమ్ము తెలిసివచ్చిన దొకింత.

నిదుర చాలు వేళయిన దని నను లేపి
వేసి, తలను నవ్వుల నూనె వేసి అంటి,
అట్లె ఒడలంత అంటి, మహాగ్నిలోన
స్నానమాడించె నను దేవి చక్కదిద్ద.

నా పలుకు, చూపు, నా చేష్ట, నా హృదయము,
రక్త మాంసాదు, లూహల రాజ్య మీవు,
చదువు సంధ్యలు, నా సమస్తమ్ము నీవు,
నీవె ప్రాణము, దేవి ! ఈ నేనె నీవు.

నా కనుబొమల మధ్యలో నాటినట్టి
బీజ మిది దేవి ! ఇంతైన పెరుగలేదు.
లేదు చిరుకొమ్మ, ఒక ఆకు లేదు, కాని
పూచె కన్నుగా ఒక అగ్ని పూవు దేవి !

దేహ కల్మషములు తీవ్రమై దేవి ! నా
గుండె కూపి రాదకుండజేసె.
కల్మషముల నెల్ల కరగింప. దినమింత
అగ్ని ద్రాగి త్రాగి అగ్నినైతి.

ఎంత నేర్పుగా గురువు బోధింపనైన
బడి చదు వదేమొ నా చెవి బడ దొకింత,
దేవి ఒడినిడి ముద్దార తెలిపినంత
ఎంత గహనమైనను గుండె కిముడునంత.

ఈ గుడిసెలోన నుండున దేమి యనుచు
ఇంతవర కుపేక్షించి నే నిందె దేవి !
ఇంత వెదకెడి నిన్నె దర్శించి, ఇంత
కాలమును తిన్న గర్వమ్ము కూల గంటి.

'అమ్మ' యని నిన్ను నే పిల్చినంతలోనె
ప్రాణవాయువై దేవి ! నా ప్రాణము లయి
దింట గూడుకట్టుకొని నన్నేమి చేయు
చుంటివోకాని ఎద నేదొ ఊహ విరిసె.

అటు నిటు నెటు పోకుండ నన్నదిమిపట్టి
నపుడు నిను వీడి పోయెదనని తలంప
కురిసితివి దేవి ! నాపైన కొసరి ఏవొ
లలిత సుందర సుమనోజ్ఞ లహరు లీవు.

దేవి ! బలము నెల్లను కూడదీసికొనుచు
ఇంత దుఃఖ సముద్రము నీది ఈది
కదల లే దొక్క అడుగైన, కాని ఇపుడె
ఇంత సంద్రము, నినుగంటి, ఇగిరిపోయె.

చెట్టు నెక్కితి కనరావు, గుట్ట నెక్కి
తి, కనరావు: శాస్త్రములను తిరుగవేసి
తి, కనరావు: స్తోత్రమ్ముల నుతించితి కన
రావు: అమ్మ ! యంటిని కంటి దేవి ! నిన్ను.

దేవి ! తపము చేతనె నిన్ను తెలిసికొంద
మని తలచి అట్లె చేసినా, నపుడు వెలుగు
లయి దొకటి వెన్క నొకటి న న్నరసిపోయె
ఆ పిదపనె నీ దర్శనమయ్యె నాకు.

నీ పదముల యందున దేవి ! నేను నుదురు
సోక మ్రొక్కినంత. మరింత చూడ ముచ్చ
టయిన వివి యని భావించినంత. నాదు
ఫాలమున పూచె కుంకుమ పూలచెట్లు.

సూర్య చంద్రులతో నీవు చూచె దీవు
వేదముల నోళ్లతోడ దీవించె దీవు
విశ్వ హృదయమ్ముతో బాధ వినెద వీవు
దేవలోకమ్ము శిరసైన దేవి ! నతులు.

ఇది 'వెలుగు నగల హంస'